# అథ తృతీయో%ధ్యాయః

## నైమిషోపాఖ్యానము

బ్రహ్మోవాచ |

యతో వచో నివర్తంతే అప్రాప్య మనసా సహ | ఆనందం యస్య వై విద్వాన్న బిభేతి కుతశ్చన || 1

యస్మాత్సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్రపూర్వకమ్ | సహ భూతేంద్రియైస్సర్వైః ప్రథమం సంప్రసూయతే || 2

కారణానాం చ యో ధాతా ధ్యాతా పరమకారణమ్ | న సంప్రసూయతే%న్యస్మాత్కుతశ్చన కదాచన || 3

సర్వైశ్వర్యేణ సంపన్నో నామ్నా సర్వేశ్వరస్స్వయమ్ | సర్వైర్ముముక్షుభిర్ధ్యేయశ్శంభురాకాశమధ్యగః || 4

యో%గ్రే మాం విదధే పుత్రం జ్ఞానం చ ప్రహిణోతి మే | తత్ప్రసాదాన్మయా లబ్ధం ప్రాజాపత్యమిదం పదమ్ || 5

ఈశో వృక్ష ఇవ స్తబ్ధో య ఏకో దివి తిష్ఠతి | యేనేదమఖిలం పూర్ణం పురుషేణ మహాత్మనా || 6

ఏకో బహూనాం జంతూనాం నిష్క్రి యాణాం చ సక్రియః | య ఏకో బహుధా బీజం కరోతి స మహేశ్వరః || 7

జీవైరేభిరిమాంల్లోకాన్ సర్వానీశో య ఈశ##తే | య ఏకో భగవాన్ రుద్రో న ద్వితీయో%స్తి కశ్చన || 8

సదా జనానాం హృదయే సన్నివిష్టో %పియః పరైః | అలక్ష్యో లక్షయన్ విశ్వమధితిష్ఠతి సర్వదా || 9

యస్తు కాలాత్ర్ప ముక్తాని కారణాన్యఖిలాన్యపి | అనంతశక్తిరేవైకో భగవానధితిష్ఠతి || 10

బ్రహ్మ ఇట్లు పలికెను -

పరమేశ్వరుని చేరుకొన (వర్ణించ) లేక వాక్కులు మనస్సుతో సహా వెనుదిరుగుచున్నవి. ఆనందస్వరూపుడగు పరమేశ్వరుని తెలుసుకున్న జ్ఞాని దేనివలనైననూ భయపడడు (1). బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, సర్వభూతములు మరియు ఇంద్రియములతో సహా ఈ సర్వము సృష్ట్యాదియందు ఆయననుండి ఉద్భవించుచున్నది (2). సర్వకారణములను సృష్టించే పరమకారణము పరమేశ్వరుడే. ధ్యానము చేయువాని స్వరూపము ఆయనయే. ఈ జగత్తు ఏ కాలమునందైననూ ఆయనకంటె భిన్నముగా మరియొక కారణమునుండి ఉద్భవించుట లేదు (3). సకలములగు ఐశ్వర్యములతో పూర్ణుడై యున్న ఆయనకు స్వయముగా సర్వేశ్వరుడని పేరు. మోక్షమును కోరువారందరిచే శంభుడు హృదయాకాశములో ధ్యానింపబడుచున్నాడు (4). ఆయన ముమ్ముందుగా నన్ను తన పుత్రునిగా సృజించి నాకు జ్ఞానమునొసంగెను. ఆయన అనుగ్రహముచే మాత్రమే నేనీ ప్రజాపతి స్థానమును పొందియున్నాను (5). అద్వితీయడగు ఆ పరమేశ్వరుడు స్వప్రకాశస్వరూపమునందు వృక్షము వలె అవికారియై ప్రతిష్ఠితుడై యున్నాడు. సర్వజగత్తు ఆత్మగా గల పరమేశ్వరునిచే ఈ జగత్తు అంతానిండియున్నది (6). పుట్టి మరణించే ప్రాణులు స్వతః క్రియాశక్తి కలవి గావు. వాటియందు క్రియాశక్తిరూపములో ఈశ్వరుడే ఉన్నాడు. అద్వితీయుడగు ఆ మహేశ్వరుడే మాయాశక్తిని అనేకప్రాణుల రూపములో ప్రకటింపజేయుచున్నాడు (7) ఆ ఈశ్వరుడే జీవులతో నిండియున్న ఈ లోకములను పాలించుచున్నాడు. ఆ రుద్రభగవానుడు అద్వితీయుడు. అనగా, ఆయనకంటె భిన్నముగా రెండవ వస్తువు లేదు (8). కంటికి కానవచ్చే జగత్తునకు సర్వకాలములలో అధిష్ఠానమై యున్న పరమేశ్వరుడు సర్వదా జనుల హృదయములో సుస్పష్టముగా ప్రకటమగు చున్ననూ

సామానయజనులకు కానరాకున్నాడు (9). అనంతశక్తిస్వరూపుడగు ఆ అద్వితీయ పరమాత్మ కాలాతీతములగు కారణములకు అన్నింటికీ కూడ అధిష్ఠానమై యున్నాడు 910).

న యస్య దివసో రాత్రిర్న సమానో న చాధికః | స్వాభావికీ పరా శక్తిర్నిత్యా జ్ఞానక్రియే అపి || 11

యదిదం క్షరమవ్యక్తం యదప్యమృతమక్షరమ్ | తావుభావక్షరాత్మానావేకో దేవస్స్వయం హరః || 12

ఈశ##తే తదభిధ్యానాద్యో జనస్సత్త్వభావనః | భూయో హ్యస్య పశోరంతే విశ్వమాయా నివర్తతే || 13

యస్మిన్న భాసతే విద్యుత్ న సూర్యో న చ చంద్రమాః | యస్య భాసా విభాతీదమిత్యేషా శాశ్వతీ శ్రుతిః || 14

ఏకో దేవో మహాదేవో విజ్ఞేయస్తు మహేశ్వరః | న తస్య పరమం కించిత్పదం సమధిగమ్యతే || 15

అయమాదిరనాద్యంతస్స్వభావాదేవ నిర్మలః | స్వతంత్రః పరిపూర్ణశ్చ స్వేచ్ఛాధీనశ్చరాచరః || 16

అప్రాకృతవపుః శ్రీమాంల్లక్ష్యలక్షణవర్జితః |అయం ముక్తో మోచకశ్చ హ్యకాలః కాలచోదకః || 17

సర్వోపరికృతావాసస్సర్వావాసశ్చ సర్వవిత్ | షడ్విధాధ్వమయస్యాస్య సర్వస్య జగతః పతిః || 18

ఉత్తరోత్తరభూతానాముత్తరశ్చ నిరుత్తరః | అనంతానందసందోహమకరందమధువ్రతః || 19

అఖండజగదండానాం పిండీకరణపండితః | ఔద్యార్యవీర్యగాంభీర్యమాధుర్యమకరాలయః || 20

ఈశ్వరునకు రాత్రింబగళ్లు (కాలము) లేవు. ఈశ్వరునితో సమానమైనవాడు గాని, ఆయన కంటె అధికుడు గాని లేడు. నిత్యము, జ్ఞానక్రియారూపము మరియు సర్వకారణము అగు మాయాశక్తి దానికి కారణము, అవినాశి, చావు పుట్టుకలు లేనిది అగు మాయాశక్తి అనే రెండు ఆ అక్షరపరబ్రహ్మయే ఆత్మగా కలిగియున్నవి. అట్టి అద్వితీయ స్వయంప్రకాశ పరంబ్రహ్మ శివుడే (12). ఏ మానవుడు సాత్త్వికమగు అంతఃకరణము గలవాడై ఆ పరం బ్రహ్మను ధ్యానించునో, ఆతడు సర్వసమర్థుడగును. ఆతని విషయములో ఈ మాయ తొలగిపోవుటచే జీవభావము నిషిద్ధమై ఆతడు జీవన్ముక్తుడగును (13). మెరుపు, సూర్యుడు, చంద్రుడు అనే జ్యోతిస్సులు ఈశ్వరుని ప్రకాశింప జేయలేవు. ఈ సర్వము ఈశ్వరుని ప్రకాశముననుసరించి ప్రకాశించుచున్నదని శాశ్వతమగు వేదవచనములు చెప్పుచున్నవి (14). స్వయంప్రకాశస్వరూపుడు, మహాదేవుడు అగు మహేశ్వరుడు అద్వితీయుడని తెలియవలెను. ఆయనకంటె ఉత్కృష్టమైన పొందదగిన గమ్యము మరియొకటి ఏదియు కానవచ్చుట లేదు (15). ఈ పరమేశ్వరుడు ఆది-అంతములు లేనివాడు, స్వభావము చేతనే దోషరహితుడు, స్వతంత్రుడు మరియు పరిపూర్ణుడు. చరాచరజగత్తు ఆయన ఇచ్ఛకు అధీనమై యుండును (16). నిర్గుణుడు, వాక్కులకు మనస్సునను గోచరము కానివాడు, ముక్తుడు, ముక్తిని ఇచ్చువాడు, కాలాతీతుడు, కాలమును ప్రవర్తింప జేయువాడు అగు పరమేశ్వరుడు దివ్యమగు దేహముతో శోభిల్లుచున్నాడు (17). ఆరు రకముల మార్గములతో కూడియున్న ఈ జగత్తునకంతకూ ప్రభువు, సర్వమునందు ఆత్మరూపముగా నుండే సర్వజ్ఞుడు అగు పరమేశ్వరుడు సర్వమునకు పైన నివసించియున్నాడు (18). ఒక దానికంటె మరియొకటి గొప్పది అనే గణనములో అంతమునందు ఆ ఈశ్వరుడు సర్వోత్కృష్టుడై యుండును. ఆయనకు పైన మరియొకటి లేదు. తేనెయందు తుమ్మెదవలె ఆయన అనంత-ఆనంద-ఘన-స్వరూపమునందు ప్రతిష్ఠితుడై యుండును (19). ఔదార్యము, సామర్థ్యము,

గాంభీర్యము మరియు మాధుర్యము అను గుణములకు నిధియగు పరమేశ్వరుడు విశాలమగు బ్రహ్మాండములను తనలో ఇముడ్చుకొనుటలో దిట్ట (20).

దేవస్య సదృశం వస్తు నాధికం చాపి కించన |
అతులస్సర్వభూతానాం రాజరాజశ్చ తిష్ఠతి || 21

అనేన చిత్రకృత్యేన ప్రథమం సృజ్యతే జగత్ | అంతకాలే పునశ్చేదం తస్మిన్ ప్రలయమేష్యతి || 22

అస్య భూతాని వశ్యాని అయం సర్వనియోజకః | అయం తు పరయా భక్త్యా దృశ్యతే నాన్యథా క్వచిత్ || 23

వ్రతాని సర్వదానాని తపాంసి నియమాస్తథా | కథితాని పురా సద్భిర్భావార్థం నాత్ర సంశయః || 24

హరిశ్చాహం చ రుద్రశ్చ తథాన్యే చ సురాసురాః | తపోభిరుగ్రై రద్యాపి తస్య దర్శనకాంక్షిణః || 25

అదృశ్యః పతితైర్మూఢైర్దుర్జనైరపి కుత్సితైః | భ##క్తైరంతర్బహిశ్చాపి పూజ్యస్సంభాష్య ఏవ చ || 26

తదిదం త్రివిధం రూపం స్థూలం సూక్ష్మంత తః పరమ్ |
అస్మదాద్యమరైర్దృశ్యం స్థూలం సూక్ష్మం చ యోగిభిః || 27

తతః పరం తు యన్నిత్యం జ్ఞానమానందమవ్యయమ్ |
తన్నిష్ఠైస్తత్పరైర్భక్తైర్దృశ్యం తద్ర్వతమాశ్రితైః || 28

బహునా %త్ర కిముక్తేన గుహ్యాద్గుహ్యతరం పరమ్ | శివే భక్తిర్నసందేహస్తయా యుక్తో విముచ్యతే || 29

ప్రసాదదేవ సా భక్తిః ప్రసాదో భక్తిసంభవః | యథా చాంకురతో బీజం బీజతో వా యథాంకురః || 30

ఆ పరమేశ్వరునితో సాటి వచ్చే వస్తువు గాని, అధికమగు వస్తువు గాని ఏదియూ లేదు. సాటి లేని ఆ ఈశ్వరుడు రాజులకు రాజుగా నిలబడియున్నాడు (21). లీలలను నెరపే ఆ ఈశ్వరుడు ముందుగా ఈ జగత్తును సృష్టించును. ప్రళయకలమునందు అది మరల ఆయనలో లీనమగును (22). ప్రాణులు ఆయన వశములో నుండును. సర్వమును నియంత్రించువాడు ఆయనయే. పరా (సర్వోత్కృష్టమగు) భక్తిచే మాత్రమే ఆయన కానవచ్చును. ఆయనను కనుటకు మరియొక మార్గము లేదు (23). వ్రతములు, సకలదానములు, తపస్సులు మరియు నియమములు అంతఃకరణశుద్ధికొరకు సహకరించునని పూర్వము పెద్దలు చెప్పియున్నారు. దీనిలో సందేహము లేదు (24). విష్ణువు, నేను, రుద్రుడు మరియు ఇతరదేవతలు ఆయనను చూడగోరి ఈ నాటికీ కఠోరమగు తపస్సులను చేయుచున్నారు (25). పతితులు, మూర్ఖులు, దుష్టులు, నీచప్రవృత్తి గలవారు ఆయనను చూడలేరు. భక్తులు ఆయనను తమలో మాత్రమే గాక బయట కూడ పూజించి, ఆయనతో సంభాషించుచుందురు (26) ఆయనకు స్థూలము, సూక్ష్మము మరియు పరము అనే మూడు రూపములుగలవు. మావంటి వారలకు స్థూలరూపము కానవచ్చును. కాని, యోగులు సూక్ష్మరూపమును చూచెదరు (27). ఈ రెండింటికీ అతీతమైనది, నిత్యము, జ్ఞాన-ఆనంద-ఘనము మరియు వినాశము లేనిది అగు రూపమును ఆయనయందు నిష్ఠ గలవారు, ఆయన మాత్రమే చరమలక్ష్యముగా గలవారు, ఆయనయొక్క వ్రతమును ఆశ్రయించినవారు అగు భక్తులు గాంచెదరు 928). ఈ విషయములో ఇన్ని మాటలేల? శివునియందలి భక్తి రహస్యములలోకెల్లా రహస్యమైనది. అది గలవాడు నిస్సందేహముగా మోక్షమును పొందును (29).మొక్కనుండి విత్తు, విత్తునుండి మొక్క వచ్చినట్లుగా, శివుని అనుగ్రహముచే మాత్రమే ఆ భక్తి అబ్బును; అనుగ్రహము భక్తి వలన కలుగును (30).

ప్రసాదపూర్వికా ఏవ పశోస్సర్వత్ర సిద్ధయః | స ఏవ సాధనైరంతే సర్వైరపి చ సాధ్యతే || 31

ప్రసాదసాధనం ధర్మస్స చ వేదేన దర్శితః | తదభ్యాసవశాత్సామ్యం పూర్వయోః పుణ్యపాపయోః || 32

సామ్యాత్ప్రసాదసంపర్కో ధర్మస్యాతిశయస్తతః | ధర్మాతిశయమాసాద్య పశోః పాపపరిక్షయః || 33

ఏవం ప్రక్షీణపాపస్య బహుభిర్జన్మభిః క్రమాత్ | సాంబే సర్వేశ్వరే భక్తిః జ్ఞానపూర్వా ప్రజాయతే || 34

భావానుగుణమీశస్య ప్రసాదో వ్యతిరిచ్యతే | ప్రసాదాత్కర్మసంత్యాగః ఫలతో న స్వరూపతః || 35

తస్మాత్కర్మఫలత్యాగాచ్ఛివధర్మాన్వయశ్శుభః | స చ గుర్వనపేక్షశ్చ తదపేక్ష ఇతి ద్విధా || 36

తత్రానపేక్షాత్సాపేక్షో ముఖ్యశ్శతగుణాధికః | శివధర్మాన్వయస్యాస్య శివజ్ఞానసమన్వయః || 37

జ్ఞానాన్వయవశాత్పుంసస్సంసారే దోషదర్శనమ్ | తతో విషయవైరాగ్యం వైరాగ్యాద్భావసాధనమ్ || 38

భావసిద్ధ్యుపపన్నస్య ధ్యానే నిష్ఠా న కర్మణి | జ్ఞానధ్యానాభియుక్తస్య పుంసో యోగః ప్రవర్తతే || 39

యోగేన తు పరా భక్తిః ప్రసాదస్తదనంతరమ్ | ప్రసాదాన్ముచ్యతే జంతుర్ముక్తశ్శివసమో భ##వేత్ || 40

సర్వకాలములలో జీవునకు అనుగ్రహము వలన మాత్రమే సర్వకార్యములు సిద్ధించును. సాధనములన్నింటిచే అంతములో సాధింపబడేది ఆ అనుగ్రహము మాత్రమే (31). అనుగ్రహమునకు సాధనము ధర్మము. ఆ ధర్మమును వేదము బోధించుచున్నది. నిత్యము ధర్మమును అనుష్ఠించుట వలన పూర్వమునందలి పుణ్యపాపములు సమానమగును (32). ఇట్లి సామ్యము వలన సాధకునకు పరమేశ్వరుని అనుగ్రహముతో సంపర్కము కలుగును.

దాని వలన వాని ధర్మము ఇనుమడించును. ధర్మము ఇనుమడించుట వలన జీవుని పాపములు పూర్తిగా క్షయమగును (33). ఈ విధముగా నశించిన పాపములు గల వ్యక్తికి అనేకజన్మలలో క్రమముగా జగన్మాతతో కూడియున్న ఆ సర్వేశ్వరునియందు జ్ఞానపూర్వకమగు భక్తి ఉదయించును (34). అంతఃకరణశుద్ధిని అనుసరించి ఈశ్వరుని అనుగ్రహములో హెచ్చుతగ్గులు ఉండవచ్చును. ఈశ్వరుని అనుగ్రహముచే కర్మసన్న్యాసము సిద్ధించును. కర్మసన్న్యాసమనగా కర్మల ఫలమును త్యాగము చేయుట మాత్రమే; వాస్తవముగా కర్మలను విడిచిపెట్టుట కాదు (35). అట్టి కర్మఫలత్యాగము వలన శుభకరమగు శివధర్మనిష్ఠ లభించును. శివధర్మము గురువును అపేక్షించేది మరియు గురువుయొక్క అపేక్ష లేనిది అని రెండు రకములుగా నున్నది (36). వాటిలో గురువు యొక్క అపేక్ష గల ధర్మము ముఖ్యమైనది; గురువుయొక్క అపేక్ష లేనిదానికంటె వంద రెట్లు గొప్పది. ఈ శివధర్మనిష్ఠ యందు శివజ్ఞానము కూడ సమ్మిళితమై యుండును (37). శివజ్ఞానముయొక్క సమన్వయము వలన సాధకుడు సంసారములోని దోషములను దర్శించును. దానివలన ఇంద్రియ సుఖములయందు వైరాగ్యము కలుగును. వైరాగ్యము అంతః కరణశుద్ధికి సాధనము (38). అంతఃకరణశుద్ధి గలవాని నిష్ఠ ధ్యానమునందే గాని కర్మయందు ఉండదు. జ్ఞానము మరియు ధ్యానము అనువాటితో కూడిన పురుషునుకు యోగము ఆరంభమగును (39). అట్టి యోగముచే పరాభక్తి (సర్వోత్కృష్టమగు భక్తి) నెలకొనును. దాని వెనువెంటనే ఈశ్వరానుగ్రహము కలుగును. జీవుడు అట్టి అనుగ్రహముచే మోక్షమును పొంది, శివునితో సమానుడగును (40).

అనుగ్రహప్రకారస్య క్రమో%యమవివక్షితః | యాదృశీ యోగ్యతా పుంసస్తస్య తాదృగనుగ్రహః || 41

గర్భస్థో ముచ్యతే కశ్చిజ్జాయమానస్తథాపరః | బాలో వా తరుణో వాథ వృద్ధో వా ముచ్యతే%పరః || 42

తిర్యగ్యోనిగతః కశ్చిన్ముచ్యతే నారకో%పరః | అపరస్తు పదం ప్రాప్తో ముచ్యతే స్వపదక్షయే || 43

కశ్చిత్ క్షీణపదో భూత్వా పునరావర్త్య ముచ్యతే | కశ్చిదధ్వగతస్తస్మిన్ స్థిత్వా స్థిత్వా విముచ్యతే || 44

తస్మాన్నైకప్రకారేణ నరాణాం ముక్తిరిష్యతే | జ్ఞానభావానురూపేణ ప్రసాదేనైవ నిర్వృతిః || 45

తస్మాదస్య ప్రసాదార్థం వాఙ్మనోదోషవర్జితాః | ధ్యాయంతశ్శివమేవైకం సదారతనయాగ్నయః || 46

తన్నిష్ఠాస్తత్పరాస్సర్వే తద్యుక్తాస్తదుపాశ్రయాః | సర్వక్రియాః ప్రకుర్వాణాస్తమేవ మనసా గతాః || 47

దీర్ఘసూత్రసమారబ్ధం దివ్యవర్షసహస్రకమ్ | సత్రాంతే మంత్రయోగేన వాయుస్తత్ర గమిష్యతి || 48

స ఏవ భవతాం శ్రేయస్సోపాయం కథయిష్యతి | తతో వారాణసీ పుణ్యా పురీ పరమశోభనా || 49

గంతవ్యా యత్ర విశ్వేశో దేవ్యా సహ పినాకధృక్ | సదా విహరతి శ్రీమాన్ భక్తానుగ్రహకారణాత్ || 50

అనుగ్రహము ఈ క్రమములో మాత్రమే లభించునని చెప్పుటలో తాత్పర్యము లేదు. పురుషుని యోగ్యత ఎట్టిదియో, వానికి దానికి తగిన అనుగ్రహము లభించును (41). ఒకడు తల్లి కడుపులో నుండగనే ముక్తుడగును. మరియొకడు పుట్టుచుండగనే ముక్తుడగును. ఇంకొకడు బాల్యములో, ¸ౌవనములో లేదా వృద్ధాప్యములో ముక్తుడగును (42). ఒకానొక జీవి పశుపక్ష్యాదిదేహములో నుండగా ముక్తుడగును. మరియొకడు నరకములోనుండగా ముక్తిని పొందును. మరియొకడు స్వర్గాదిపుణ్యలోకమును పొంది, అచట పుణ్యము క్షీణించి, ఆ లోకము

జారి పోవుచుండగా ముక్తుడగును (43). ఒకానొకడు పుణ్యలోకమును కోల్పోయిన తరువాత మరల భూలోకములో జన్మించి ముక్తుడగును. మరియొకడు ఈ విధముగా తిరిగి వచ్చే మార్గములో ఉంటూ ఉండగానే ముక్తుడగును (44). కావున, మానవులు ఒకే విధములో ముక్తులగుదురని చెప్పుట తగదు. జ్ఞానమునకు మరియు అంతఃకరణశుద్ధికి అనురూపమగు అనుగ్రహము వలన మాత్రమే ముక్తి లభించును (45). కావున, మీరందరు శివుని అనుగ్రహము కొరకై వాక్కులో మరియు మనస్సులో దోషములను విడిచిపెట్టి, భార్య పిల్లలు మరియు అగ్నులతో కూడినవారై అద్వితీయుడగు శివుని మాత్రమే ధ్యానిస్తూ, శివునియందు నిష్ఠ గలవారై, శివుడే పరమలక్ష్యముగా గలవారై, శివునియందు లగ్నమైన మనస్సులు గలవారై, శివుని శరణు పొంది, ఆయనను మాత్రమే మనస్సులో నిలుపుకొని, కర్మలను అన్నింటినీ చేయుడు (46, 47). వేయి సంవత్సరములు సాగే దీర్ఘసత్రయాగము మీచే ఆరంభించ బడినది. ఈ సత్రయాగము పూర్తి కాగానే, మంత్రముల ప్రభావముచే ఇచటకు వాయుదేవుడు రాగలడు (48). ఆయనయే మీకు మోక్షమును దానికి కావలసిన ఉపాయములతో సహా బోధించగలడు. తరువాత మీరు పవిత్రమైనది, మిక్కిలి సుందరమైనది అగు వారాణసీ నగరమునకు వెళ్లుడు. అచట శోభాయుక్తుడు, పినాకధారి అగు శివుడు పార్వతీదేవితో కూడి భక్తులననుగ్రహించుట కొరకై సర్వదా విహరించుచుండును (49, 50).

తత్రాశ్చర్యం మహద్దృష్ట్వా మత్సమీపం గమిష్యథ | తతో వః కథయిష్యామి మోక్షోపాయం ద్విజోత్తమాః || 51

యేనైకజన్మనా ముక్తిర్యుష్మత్కరతలే స్థితా | అనేకజన్మసంసారబంధనిర్మోక్షకారిణీ || 52

ఏతన్మనోమయం చక్రం మయా సృష్టం విసృజ్యతే | యత్రాస్య శీర్యతే నేమిస్స దేశస్తపసశ్శుభః || 53

ఇత్యుక్త్వా సూర్యసంకాశం చక్రం దృష్ట్వా మనోమయమ్ | ప్రణిపత్య మహాదేవం విససర్జ పితామహః || 54

తే %పిహృష్టతరా విప్రాః ప్రణమ్య జగతాం ప్రభుమ్ | ప్రయయుస్తస్య చక్రస్య యత్రనేమిరశీర్యత || 55

చక్రం తదపి సంక్షిప్తం శ్లక్ ష్ణం చారుశిలాతలే | విమలస్వాదుపానీయే నిపపాత వనే క్వచిత్ || 56

తద్వనం తేన విఖ్యాతం నైమిషం మునిపూజితమ్ | అనేకయక్షగంధర్వవిద్యాధరసమాకులమ్ || 57

అష్టాదశ సముద్రస్య ద్వీపా గచ్ఛన్ పురూరవాః | విలాసవశముర్వశ్యా యాతో దైవేన చోదితః || 58

అక్రమేణ హరన్మోహాద్యజ్ఞవాటం హిరణ్మయమ్ | మునిభిర్యత్ర సంక్రుద్ధైః కుశవజ్రై ర్నిపాతితః || 59

విశ్వం సిసృక్షమాణా వై యత్ర విశ్వసృజః పురా | సత్రమారేభిరే దివ్యం బ్రహ్మేశా గార్హపత్యగాః || 60

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా! అచట గొప్ప అద్భుతమును చూచి నా వద్దకు రండు. అపుడు మీకు మోక్షము కొరకై ఉపాయమును బోధించెదను (51). దాని వలన ఒకే ఒక జన్మలో మోక్షము మీకు కరతలామలకము కాగలదు. ఆ మోక్షము మీకు అనేకజన్మల సంసారబంధమునుండి విముక్తిని కలిగించును (52) నేను ఈ మనస్సుచే సృష్టించబడిన చక్రమును విడిచిపెట్టుచున్నాను. దీని అంచు ఏ చక్రమును మనస్సుతో సృష్టించి, మహాదేవునకు నమస్కరించి దానిని విడిచిపెట్టెను (54). ఆ బ్రాహ్మణులు కూడ చాల సంతోషించి జగత్తులకు ప్రభువగు బ్రహ్మకు నమస్కరించి, ఆ చక్రముయొక్క ధార విరిగినస్థలమునకు బయలు దేరిరి (55). ఆ విధముగా విడిచిపెట్ట బడిన ఆ మృదువైన చక్రము స్వచ్ఛము మరియు రుచికరము అగు నీరు గల అడవిలో ఒకానొక స్థలములో సుందరమగు రాతి పలకపై

పడెను (56). ఆ కారణముచే మహర్షులచే పూజించబడే ఆ వనమునకు నైమిషారణ్యము అను పేరు వచ్చెను. ఆ వనము అనేకులగు యక్ష గంధర్వ విద్యాధరులతో రద్దీగా నుండును (57). పురూరవ మహారాజు ఊర్వశితో కూడి విహరిస్తూ దైవముచే ప్రేరేపించ బడినవాడై సముద్రములోని పదునెనిమిది ద్వీపములను దాటి అచటకు వెళ్లెను (58). ఆయన అజ్ఞానముచే బంగరు యజ్ఞవాటికను అక్రమముగా హరించుచుండగా, మిక్కిలి కోపించిన మునులు అచట ఆయనను దర్భలను వజ్రములుగా మార్చి పడగొట్టిరి (59). పూర్వము బ్రహ్మచే ఆజ్ఞాపించబడి జగత్తును సృష్టించగోరి ప్రజాపతులు ఇచటనే గార్హపత్యాగ్నిని ఆశ్రయించి సత్రయాగమునారంభించిరి (60).

ఋషిభిర్యత్ర విద్వద్భిశ్శబ్దార్థన్యాయకోవిదైః | శక్తి ప్రజ్ఞాక్రియా యోగైర్విధిరాసీదనుష్ఠితః || 61

యత్ర వేదవిదో నిత్యం వేదవాదబహిష్కృతాన్ | వాదజల్పబలైర్ఘ్నంతి వచోభిరతివాదినః || 62

స్ఫటికమయమహీభృత్పాదజాభ్యశ్శిలాభ్యః ప్రసరదమృతకల్పస్వచ్ఛపానీయరమ్యమ్ |

అతిరసఫలవృక్షప్రాయమవ్యాలసత్త్వం తపస ఉచితమాసీన్నైమిషం తన్మునీనామ్ || 63

ఇతి శ్రీశివమహాపురాణ వాయవీయ సంహితాయం పూర్వభాగే నైమిషోపాఖ్యానం నామ తృతీయో%ధ్యాయః (3).

అచట వ్యాకరణ-మీమాంస-తర్కశాస్త్రములలో నిష్ణాతులు, విద్వాంసులు అగు ఋషులు శక్తితో, జ్ఞానముతో మరియు కర్మయోగభావనతో కర్మలను అనుష్ఠించిరి (61). అచట నిత్యము అతివాదులగు వేదవేత్తలు వేదధర్మమునుండి బహిష్కరింపబడిన వారిని వాదము మరియు జల్పము (ఇతరుల సిద్ధాంతమును

పరుషముగా ఖండించి తన సిద్ధాంతమును స్థాపించుట) అనువాటి బలముచే ఇబ్బంది పెట్టుచుండిరి (62). స్ఫటికములతో నిండియున్న పర్వతముల క్రింది భాగములయందు గల రాళ్లనుండి జారిపడే అమృతతుల్యమైన స్వచ్ఛమగు నీటితో సుందరమైనది, మిక్కిలి రుచికరమగు పళ్లతో కూడిన చెట్లతో నిండియున్నది, హింసను విడనాడిన మృగములు గలది అగు ఆ నైమిషారణ్యము మునుల తపస్సునకు అనుకూలముగా నుండెను (63).

శ్రీ శివమహాపురాణములోని వాయవీయసంహితలో పూర్వభాగమునందు నైమిషోపాఖ్యానమనే మూడవ అధ్యాయము ముగిసినది (3).